SIMHA VIDYA SERIES.

# ప్రశ్నాబిలము.



గుంటూరు,

చంద్రికా ముద్రాక్షరశాలయం[dు]

ముద్రింపఁబడి

ప్రచురింపఁబడినది.



1922 సం॥

శ్రీరస్తు.

# బ్రహ్మాబిలము

శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యపరిపూర్ణమగు పర
మాత్మకు బ్రహ్మాబిలమే నివాసస్థానము.

1. సీ॥ నీలతోయదమధ్య నీవారశూకవత్
    పరిపూర్ణ కాంతిచే బ్రబలియుండు
శంపాలతలభాతిఁ జటులప్రకాశమై
    చంచరీకమురీతిఁ జెలఁగుచుండు
కరికుంభమధ్యస్థ ఘనమౌక్తికద్యుతుల్
    వెలయఁబ్రకాశమై యలరుచుండు
ఋతుశరత్కాలంబు రూఢిగావ్యాపింగునట్లు వెలుఁ
    చంద్రచంద్రికలీలఁ జెలఁగుచుండు కుంభ
పద్మగర్భోదయంబైన భానుపగిది
పటిమ దీపించుఁజటులహృత్పద్మమందు
పరమహంసవిహారచిత్ప్రణవధార
పదులనైదింటశోభిల్లు బ్రహ్మాబిలము.

టీ॥ పద్మగర్భోదయంబు=కమలములోని భాగమునకు ఉన్నతినిగలుగఁజేయునది—కమలములకు వికాసము కలుగఁజేయువాఁడు,ఐనభానుపగిదిన్=అయినట్టి సూర్యునివలె, పటిమన్=పటుత్వముతో, దీపించు=ప్రకాశించునట్టి, చటులహృత్పద్మమ్మందున్ = వికాసము నొందినమనఃకమలమునందు, పరమహంసవిహారచిత్ప్రాణవథార = వేదాంతవేత్తలువిహరించునట్టి చిత్ప్రాణవమార్గమైన, పదులనైదింటన్=పంచాశద్వర్ణాత్మకమై, శోభిల్లు=వెలుఁగునట్టి, బ్రహ్మబిలము = బ్రహ్మరంధ్రము, నీలతోయదమధ్యనీవారశూకవత్—నీల=నల్లనైన, తోయద=కంటి గుడ్డుయొక్క, మధ్యనడుమను, నీవారశూకవత్=నివ్వరిధాన్యపుముల్లువలెనేసూక్ష్మమైనదై, పరిపూర్ణకాంతిచేన్ = నిండినకాంతిచేత, ప్రబలియుండున్=అతిశయించియుండును, శంపాలతలభాతిన్=మెఱుపుతీఁగలవలె, చటులప్రకాశమై=అధికప్రకాశముకలదై, చంచరీకమురీతిన్ = తుమ్మెదలవలె, చెలఁగుచుండున్ = ప్రకాశించుచుండును, కరికుంభమధ్యస్థఘనమౌక్తికద్యుతుల్ = ఏనుఁగుకుంభములోపలనుండెడి దొడ్డవియయినముత్యాలకాంతులు, వెలయన్=

ప్రకాశింపఁగా, ప్రకాశమై=ప్రకాశముకలదై, అలరుచుం డుఁ =వికాసమునొందుచుండును. ఋతుశరత్కాలంబు =శరదృతువునందు, రూఢిగాఁ=ప్రశస్తముగా,వ్యాపించు =అంతటనుప్రసరించునట్టి, చంద్రచంద్రికలీలఁ = చంద్రుఁడువెన్నెలవలె, చెలఁగుచుండుఁ=వెలయుచుండును.

తా॥ కమలములనువికసింపఁజేయునట్టి సూర్యునివలె మిక్కుటమైనవెలుఁగుతో వికాసమునొందిన మనఃకమలమునందు వేదాంతవేత్తలకు విహారస్థానమయిన చిత్ప్రాణవమార్గమై యక్షరపరబ్రహ్మముతో వెలుఁగునట్టి బ్రహ్మరంధ్రముకంటెయాదలి నల్లగుర్తుయొక్క నడుమను నివ్వరిధాన్యపుముల్లువలెనే సూక్ష్మమైనదై పరిపూర్ణకాంతితో నొప్పుచుండును. మెఱుపుతీఁగ తళతళవెలుఁగునట్లు వెలుఁగుచు భ్రమరముంబోలె వర్తిల్లుచుండును, ఏనుఁగుకుంభమునందుఁబుట్టిన ముత్యాలపూసలకాంతులవంటి కాంతులతో తేజరిల్లుచుండును. శరత్కాలమునందుస్వచ్ఛమయినయాకాశమునందునిండి వెలుఁగుచున్న పున్నమనాటి వెన్నెలవలె స్వచ్ఛముగావెలుగుచుండును అని తాత్పర్యము.

<u>నీలతోయదము:</u>— తోయము అనఁగా ఉదకము. తోయమునుధరించినది తోయదము. కంఠప్రదేశమునందు నీరున్నకారణమున తోయదమని చెప్పఁబడెను.

<u>చంద్రిక:</u>— బ్రహ్మరంధ్రము పున్నమనాటివెన్నెలవలె స్వచ్ఛముగానున్నది. అనఁగా ఆణవకార్మిక మాయిక మాయేయ తిరోధానములను పంచమలములు లేక శుద్ధముగాను నిర్మలముగాను నున్నదని తెలియవలయును.

<u>బ్రహ్మబిలము:</u>— ప్రత్యక్షముగఁగనఁబడెడి యీస్థూల దేహమందు మూలాధారమునుండి కపాలకుహరమువఱకువీణాదండమువలె నొక వెన్నెముకయుండును. దానిని బ్రహ్మదండియని చెప్పుదురు. ఆవెన్నెముక మధ్యను గొట్టమువలె సూక్ష్మరూపముగనుండు రంధ్రమును బ్రహ్మనాడి యందురు. ఆనాడి ఇడాపింగళనాడులకు మధ్యనుండినదై 'సుషుమ్న' యనుపేరఁ బరగుచున్నది. ఈసుషుమ్నయే బ్రహ్మాత్మైక్య ప్రతిపాదకమైనది గనుక బ్రహ్మనాడి యని చెప్పఁబడును. ఈసుషుమ్న కంతర్గతముగా కుండలినీశక్తి గలదు. ఈవీణాదండమునకు వీణకుమెట్లువలెనే యొకటి

మీఁదనొకటిగా ముప్పదిమూఁడుపూసలుండును. అందు మొదటియేఁడిటినే మెడపూసలని కడమయిరువదియాఱిం టిని వెన్నుపూసలనియుఁ జెప్పుదురు. ఈవెన్నెముకకే బ్రహ్మ దండి మేరువు నను పేరులు. ఈపూసలనడుమ నాళముండు ను. అదియే సుషుమ్నానాళము. ఈనాళముగుండ సుషు మ్న అధోముఖముగమూలాధారమునకువచ్చి మనస్సును విషయములకు పోవునట్లుచేసి తాను తిరిగి యూర్ధ్వముఖ ముగావ్యాపించుచు వెన్నుపూసలను మెడపూసలనుదాటి పెద్దనాళముతోఁ గలియును. ఈపెద్దనాళమునకే "బ్రహ్మ బిలమనియు" బ్రహ్మరంధ్రమనియు పేరులు. ఈసుషుమ్న కడుకోమలమైనదియును బహుమృదువైనదియునుగావున నేయుపాయమును గలుగకుండ శిరస్సునందలికపాలకుహర మునెడిదట్టమయిన యెముకల పెట్టెలో నిమడ్చఁబడి అతి జాగ్రతతోఁగాపాడవలసివచ్చెను. ఈసుషుమ్న యుండెడు స్థానము బ్రహ్మరంధ్రము. ఇదియే ప్రాణాధారము. ఈసుషు మ్న అతికోమలమును సుకుమారమునై యిడాపింగళలను నాడులతో మూలాధారమునుండి యూర్ధ్వముఖముగాఁ బోయి"కుండలీశక్తి" యను పేరింతోఁ గపాలకుహరమునఁ

ప్రవేశించి యచటనుండి నాలుకకొనకుఁజేరి "సరస్వతి" యనుపేరిటఁ బ్రసిద్ధమగుచున్నది. ఈసుషుమ్న మూలాధారమునుండి సహస్రారముదనుక వ్యాపించుచు పశ్చిమాభిముఖమై భ్రూమధ్యమందు ఇడాపింగళానాడులతోఁగలిసియుండును. ఆస్థానమే త్రివేణీసంగమము, త్రికూటము, ఆజ్ఞాచక్రము అని చెప్పఁబడును. సుషుమ్న తెల్లనిరంగుగలదిగాన శుక్లనాడియని పరబ్రహ్మమునుగురించిన జ్ఞానమునకు సాధకముగావున బ్రహ్మనాడియనియును జెప్పఁబడును. ప్రయాగలో సరస్వతివలెనే సుషుమ్నయును గుప్తగామిని యని తలంచునది.

చెవులు కన్నులు ముక్కు నాలుక వీనినుండి యేడునాడులు మేదస్సు (brain) నందు సుషుమ్నతోఁ గలియును. ఆస్థానమునే బ్రహ్మరంధ్రమనియు, బ్రహ్మబిలమనియు, సప్తపథయనియుం జెప్పుదురు. అచ్చటనే సహస్రారముండును. శ్రోత్ర! చక్షుర్జిహ్వా ఘ్రాణములనుండిపోవునాడులుకలియు స్థానము గనుక దీనినే చతుష్పథమనియు శృంగాటకమనియుం జెప్పుదురు. పరబ్రహ్మముయొక్క నివాసస్థానమగుటవలన బ్రహ్మబిలమనియుం జెప్పుదురు.

బ్రహ్మరంధ్రము.—భూపతనమైనతోడనే బిడ్డలకు స డినెత్తిన మృదువైనగుంట యొకటియుండును. ఆగుంటకు దిగువతట్టున నొకకమలముండును. దీనికే సహస్రారకమ లమనిపేరు. శిశువు గర్భములోనున్నప్పుడు యీకమలము వికసించియుండును. ఆకారణముననే గర్భములోనిబిడ్డలకు నేడవమాసము మొదలు భూపతనమువఱకు జ్ఞానముండెం నై భూపతనమయినతోడనే యజ్ఞానమనెడిమాయ యా వరించి యీకమలము ముకుళించుకొనిపోవును. గర్భము లోనున్నప్పుడు శ్లో॥ త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణములయందు ఆత్మవిస్తరించలేదు. కావున ఆయింద్రియములయొక్క విష యములును లేవు. బ్రహ్మబిలము అనఁగా బ్రహ్మరంధ్రము నుండియే జ్ఞాననేత్రముద్వారా శిశువు గర్భనరకమందుండి యును సమస్తమును దెలిసికొనును. నాభివద్దనుండివచ్చెడి తీఁగగుండ తల్లిభుజించిన పదార్థములయొక్క రసమును అనుభవించును. ఈబ్రహ్మరంధ్రముగుండనే ఆత్మస్థూలశరీ రములో ప్రవేశించును.

☞ భూపతనమైనది మొదలు బిడ్డలకు మాడునఁ జము రుపెట్టి పసుపురాచుట యాచారమని సర్వత్ర తెలిసినవిష

యమే. ఇట్లు దినదినమును జముకురాయరాయ బిడ్డలకు నడినెత్తిన నుండెడిగుంట పూడికనుపడకుండును. పంద్రెండు సంవత్సరములకు యెముకలన్నియు నతుకుకొని తల గట్టిపడును.

సహస్రారకమలముననే బ్రహ్మరంధ్రమనియు ఆ కమలముయొక్క మధ్యనుండెడి నాళనముననే సుషుమ్నానాళమనియుం బేరులు. సుషుమ్న మూలాధారమునుండి తిరిగివెళ్ళునపుడు తనంతోడనుండెడు ఇడపింగళయను నిరుచేడియల నిరుప్రక్కల నిడికొని నూఱునాడులతో ననాహతమునకువచ్చి యానూఱునాడుల నక్కడవిడిచి యూర్ధ్వముఖవ్యాపినియై శిరస్సునకుం బోవును.

హృత్పద్మము:—ఇదియే సహస్రారకమలము. ఈకమలము కపాలకుహరమందుండును. దీనినిగూర్చి బ్రహ్మవిద్యయందు విశదముగ వ్రాయఁబడెను.

పరమహంస:—అనఁగా బ్రహ్మవేత్త. బ్రహ్మవేత్త, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అని బ్రహ్మవేత్తలు నాలుఁగువిధములు. ఈనలుగురికి ముక్తి

సమానమని తెలియునది. అందు బ్రహ్మవేత్త—కర్మ ఫల త్యాగియై నిత్య నైమిత్తికకర్మలను యథావిధిగ జరుపుచు యదృచ్ఛాలాభ సంతుష్టియును నిరహంకారమును సర్వ భూతదయా ళుత్వమును గలిగి యాత్మారాముండును నాత్మ తృప్తుండునై కామక్రోధలోభమోహమద మాత్సర్యంబు లనెడుఅరిషడ్వర్గంబులేక ప్రియాప్రియములు నిందాస్తుతు లు మానావమానంబులు శత్రుమిత్రులనెడు భేదములు లేక సంచరించువాఁడును, గుణాతీతుండును, దర్పణమును రూప మంటనిరీతిని నాలుకను నేతిజిడ్డంటనిరీతిని కుమ్మర పురుగు వలె అంటియంటకయుండువాఁడును బ్రహ్మవేత్తయని చెప్పఁబడును. అగ్నిచేఁ గాలినపత్రము పత్రమువలెనే గను పించును అజ్ఞానదృష్టిచేత శరీరసహితముగాఁ గనుబడును. నిజముగాఁజూచినచో అశరీరుఁడనియే చెప్పవలయును. ఆతఁడే సుందరస్త్రీని సూకరముగఁజూచును. బ్రహ్మవిద్వ రుఁడు.—కర్తలనువదలి సంప్రాప్తసుఖదుఃఖము లనుభ వించుచు సమాధినిష్ఠాగరిష్ఠుండై యుండువాఁడు బ్రహ్మ విద్వరుఁడని చెప్పఁబడును. బ్రహ్మవిద్వరీయుఁడు—సర్వ కాలములయందు సహజామనస్క-రాజయోగ నిష్ఠాగరి

ష్ఠుండై బరులవలన మేలుకొలుపంబడి కించిదాహారంబుఁ గొనుచు నిద్రఁబోవువానివలె విశ్వమును మఱచియుండు వాఁడు. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.—బాహ్యాంతరములు మఱచి నిరంతర నిర్వికల్పసమాధినిష్ఠుండై ప్రకాశించువాఁడు.

2. సీ॥ పద్మకోశద్యుతి ప్రతికాశమై మించి
పావకస్థానంబు పైఁదనర్చి
ప్రాణానిలాపాన పరిపూర్ణసంచార
కుంభకస్థానత త్కుహరమందు
తాలుమూలాంతర ద్వాదశస్థానమా
పరనాళవీథులఁ బ్రబలఁగలిసి
లింగాంగసంధాన లీలానుకూలమౌ
హంసాక్షరద్వయం బాశ్రయించి
యుర్వివర్ణద్వయంబున కూర్ధ్వమైన
వర్ణభేదంబులును లేని వనితఁగనుచు
వనితఁగనుచూపులో స్వర్ణవర్ణమగుచు
బదులనై దింట శోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ పద్మకోశద్యుతిప్రతికాశమై=తామర మొగ్గ వెలుఁగును బోలినదై, మించి=అతిశయించి, పావకస్థానంబుపైఁ

=అగ్నిపదముమీఁదఅనఁగా భ్రూమధ్యస్థానమునకు మీఁద, తనర్చి = ఒప్పినదై. ప్రాణానిలాపాన పరిపూర్ణసంచార కుంభకస్థాన తత్కుహరమందుఁ — ప్రాణానిల= ప్రాణవాయువుయొక్క. అపాన= అపానవాయువుయొక్క. పరిపూర్ణ=నిండిన—అనఁగా కొఱతలేని, సంచార=సంచారముగల, కుంభకస్థాన=కుంభకస్థానమనెడి, తత్కుహరమందుఁ = ఆకపాలకుహరమందలి దహరాకాశమనెడి బ్రహ్మరంధ్రమునందు, తాలుమూలాంతర ద్వాదశస్థానమహాపరనాళవీధులఁ— తాలుమూల = దవుడలమొదళ్లయొక్క, అంతర=లోపలిదయిన, ద్వాదశస్థానమహా=సహస్రారకమలముయొక్క, పర=పరమునుదెలుపునట్టి, నాళవీధులఁ=రంధ్రములమార్గములందు, ప్రబలఁ = అతిశయిల్లగా. కలిసి=కూడి, లింగాంగసంధానలీలానుకూలమహా=జీ ఎ౦ లి 'పమైన వినోదవ్యాపారమునకు ననువైన హంసాక్షరద్వయంబుఁ=హకారము సకారము అనునట్టి యక్షరములనురెంటిని, ఆశ్రయించి = సేవించి—అనఁగా హంసస్వరూపమగు పరబ్రహ్మమును చక్కఁగవిచారణచేతను లక్ష్యానుసంధానముచేతను తెలిసికొని, ఉర్విఁ=భూ

మియందు, వర్ణద్వయంబునకుఁ=హకారసకారములనెడి రెండక్షరములకు, ఊర్ధ్వమైన=మీఁదిదయిన, వర్ణభేదంబులును=జాతిభేదములు, లేనివనితఁ=లేనిదయిన ముక్తికాంతను, కనుచుఁ=చూచుచు, వనితఁగనుచూపులోఁ=ఆ ముక్తికాంతనుజూచిన చూపునందు, స్వర్ణవర్ణమగుచుఁ=స్వచ్ఛమగు బంగారమువలె మలినరహితమైనదై—అనఁగా ఆణవ కార్మిక మాయిక మాయేయ తిరోధానము లనెడు పంచమలములును లేనిదై, పదులనైదింటఁ=అయిదు పదులచేత, పంచాశద్వర్ణాత్మకమై, బ్రహ్మబిలము=బ్రహ్మరంధ్రము, శోభిల్లుఁ=వెలుగుచుండును.

తా॥ తామరమొగ్గవలె వెలయునట్టి యగ్నిపదమయిన భ్రూమధ్యస్థానముకుమీఁద ప్రాణాపానవాయువులు అడ్డములేక సంచరించునట్టి కుంభకస్థానమందు తాలుమూలములలోనుండి మూర్ధస్థానమువఱకు వ్యాపించినాడీరంధ్రములందుఁ జక్కఁగా గలిసికొని జీవేశ్వరైక్యలీలలకు సనునై ద్వ్యక్షరాత్మకమయిన పరబ్రహ్మమును తెలిసికొని, యాపరబ్రహ్మతోడి భేదము నెఱుఁగక కుంభకస్థానమునకు మీఁదై వర్తించునట్టి ముక్తికాంతను జూచుచు నాచూపు

నందు స్వచ్ఛమగు బంగారమువలెనే మలినరహితమైనదై పంచమలములు లేనిదై పంచాశద్వర్ణాత్మ కాక్షరపరబ్రహ్మముచేత బ్రహ్మబిలము ప్రకాశించుచుండునని తాత్పర్యము.

పావకస్థానము.—ఆజ్ఞాచక్రమందు హకారసకారములనెడు సూర్యచంద్రమండలముల మధ్యనుబిందువనెడు అగ్నిమండల ముండుటనుబట్టి భ్రూమధ్యమే పావకస్థానమని చెప్పఁబడెను.

ద్వాదశస్థానము:—ఆజ్ఞాచక్రమునకుమీఁద పండ్రెండంగుళములదూరమున సహస్రారచక్ర ముండుటచేత సహస్రారముద్వాదశస్థానమనియు ద్వాదశాంతమనియు చెప్పఁబడెను. ఆజ్ఞాచక్రమునకుఁ బైన నొకయంగుళము వఱకు శక్తియని దానిపైన మూఁడంగుళముల వఱకు వ్యాపిని యని ఆవలనాలుఁగంగుళములదాఁక సమనయని ఆమీఁద నాలుఁ గంగుళముల వఱకు ఉన్మనియని సుషుమ్నకుఁ పేరులు.

కుహరము.—ఆత్రిగుహా; దహరాకాశము.

లింగాంగసంధానము.—హకారబిందు సకారములే హంస. హకారము శివబీజము, సకారము శక్తిబీజమును, ఈ రెంటిమధ్యను శివశక్తులకు ఐక్యస్థానమై బిందురూపమగు బుద్ధితత్వము ప్రకాశించుచుండును. హకారమే శుక్లము సకారమే రక్తము. ఈరెంటియొక్క సంయోగమే బిందువు. హకారమే సూర్యనాడి లేక పింగళ యని చెప్పఁబడి కుడిముక్కున వాయువును బీల్చును. సకారమే చంద్రనాడి లేక యిడయని చెప్పఁబడి ఎడమముక్కున వాయువును బీల్చును, మధ్యనుండెడి బిందువు తేజోనాడియని లేక సుషుమ్నయని చెప్పఁబడును. సకారము శక్తిబీజముకనుక బుద్ధి సకారమువైపున తిరిగినప్పుడు ప్రపంచవిషయ జ్ఞానమును, హకారమువైపున తిరిగినప్పుడు నిర్విషయజ్ఞానమును కలుగును. ఈమూఁడే నాదబిందుకళలు. ఈహంస ప్రకృతిమయమైన ప్రపంచజ్ఞానమును శివమయమైన పరబ్రహ్మజ్ఞానమును అనెడు రెండు ఱెక్కలతో చిద్బిందురూపమున సకలప్రాణులయొక్క సహస్రారకమలములయందు సంచరించుచుండును.

☞ హంసవిషయము బ్రహ్మవిద్యయందు విశదముగ వ్రాయఁబడెను.

<u>కుంభకస్థానము:</u>— పూరించుట = ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నా నాళద్వారముగ నుత్థాపనము చేయుట:— దీని నేకుండలిని పకళించుటయనియుఁ జెప్పుదురు. రేచించుట = బ్రహ్మరంధ్ర పర్యంతము పూరించినవాయువును మరలసుషుమ్నా నాళ ద్వారముగ మూలాధారమునకుఁ జేర్చుట. కుంభించుట= పూరించినవాయువును కొన్నినిముషములు రెండుము క్కులుమూసి రేచించకుండ బ్రహ్మరంధ్రమందు అనఁగా కపాలకుహరమందు నిలుపుట. ఈ ప్రకారము కుంభకము నకు స్థానము గనుక కపాలకుహరమే కుంభకస్థానమని తెలియునది.

3. సీ॥ ప్రణవకుండలిశిరో స్థనిమండలంబున
మండలత్రయమును మాటుపఱిచి
మండలత్రయమున మాటుపడున్నట్టి
ఓంమాత్రత్రయం బనువుదెలిసి

ఓంమాత్రత్రయం బనువుదెలిసినచోట
నంగలింగజ్ఞాన సంగమెఱిఁగి
యంగలింగజ్ఞాన సంగస్థలంబున
నలబిందుపంచకం బైక్యపఱిచి
పరచిదానందషట్కోశ పద్మమందు
మందిరాంతరచిత్కళా మండలమున
కంజజానందమణితేజ కందమునను
పదులనైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ ప్రణవకుండలి శిరోన్నతిమండలంబునన్ = ప్రణవరూపమైన కుండలియొక్క అగ్రభాగమునందలి ఉన్నతస్థానమునందు అనఁగా సుషుమ్నయొక్క అగ్రభాగమునందు, మండలత్రయమున్ = చంద్రసూర్యాగ్ని మండలముల మూఁడింటిని, మాటుపఱిచి=మాటుపడునట్లు చేసి— కప్పివేసి, మండలత్రయమునన్ = ఆమూఁడుమండలముల యందును, మాటుపడి=మఱుఁగుపడి, ఉన్నట్టి = ఉన్నటువంటి, ఓంమాత్రత్రయమ్ = అకారఉకార మకారములు మూఁడింటిని, అనువుదెలిసి = చక్కఁగాఁ దెలిసికొని, ఓంమాత్రత్రయంబనువు దెలిసినచోటన్ = అకారఉకార

మకారములనెడి మూఁడక్షరముల లక్ష్యార్థ భావార్థ అనుభవార్థములను జక్కఁగాఁ దెలిసికొనినస్థలమందు, అంగలింగజ్ఞాన సంగమెుకఁగి=వీశ్వరైక్యానుసంధానమును తెలిసికొని, అంగలింగజ్ఞానసంగస్థలంబునన్=ప్రకృతిపురుషులకునైక్యము పొసఁగినచోట, అలబిందుపంచకంబు=జ్ఞాతమనోబుద్ధి చిత్తాహంకారంబులను, ఐక్యపఱిచి=లయింపఁజేసి, పరచిదానందషట్కోశపద్మమందున్=సర్వోత్కృష్టమయిన జ్ఞానానందషట్కోశకమలమునందు, (షట్కోశములు—అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము, హిరణ్మయకోశము.) అనఁగా ఆఱుకోశములతోఁ గూడిన హృదయకమలమునందు, మందిరాంతర చిత్కళామండలమునన్=దేహమనెడి యింటిలోపల చిత్కళామండలమునందు—అనఁగా దహరాకాశమందు, కంజజానందమణితేజకందమునన్=బ్రహ్మానందమనెడిరత్న తేజమునకు మూలస్థానమునందు—బ్రహ్మానందముకలిగెడిచోట, పదులనైదింటన్=పంచాశద్వర్ణాత్మకత్వముచేత, బ్రహ్మబిలము=బ్రహ్మరంధ్రము, శోభిల్లున్=ప్రకాశించును.

తా॥ ప్రణవస్వరూపమైన కుండలియొక్క శిరోభాగ మగు ఉన్మనీస్థానమునందు అనఁగా సుషుమ్నయొక్క అగ్రమునందు చంద్రసూర్యాగ్నిమండలముల మూఁడింటిని లీనముచేసి వానిచేఁ గప్పఁబడియున్న అకారఉకార మకారాత్మకమయిన ప్రణవమును చక్కఁగాఁ దెలిసికొని ఆప్రణవముయొక్క లక్ష్యార్థభావార్థ అనుభవార్థముల ను జక్కఁగాఁ దెలిసికొనిన స్థలమందే జీవపరమాత్మైక్య జ్ఞానమునుబడసి జ్ఞాతమనోబుద్ధి చిత్తాహంకారంబులనెడి బిందుపంచకమును లయింపఁజేసి పరమై చిత్తై యానంద మై యొప్పునట్టి అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ హిరణ్మయకోశంబులనెడి యా ఱుకోశములతోఁ గూడిన దేహరూపమయిన యింటిలోని చిత్కళాసమూహమైనదియు బ్రహ్మానందమనెడి రత్న ముయొక్క వెలుఁగునకు మూలస్థానమయి యొప్పునట్టి బ్రహ్మస్థానమందు పంచాశద్వర్ణాత్మకత్వముచేత బ్రహ్మరంధ్రము వెలుఁగొందునని తాత్పర్యము.

☞ షట్కోశములు:— అన్నమయకోశము=అన్నమువలనఁబుట్టి అన్నమువలననేవృద్ధిఁబొంది శుక్లశోణితములవలనఁగలిగిన ఉండుట పుట్టుట పెరుగుట మాఱుట చిక్కుట నశించుట యనునాఱుభావవికారములు గలదై స్తంభమువలె స్థూలమై ప్రత్యక్షముగ కరచరణాద్యవయవములతోను త్వక్చర్మమాంస రుధిర మేదోస్థి మజ్జలనెడు సప్తధాతువులతోను గూడినదై సమస్తప్రాణికోటికి కనబడెడి స్థూలశరీరమే అన్నమయకోశము. ప్రాణమయకోశము= సమానవ్యానోదాన ప్రాణఅపానంబు లనెడుపంచప్రాణంబులు వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులు నాగకూర్మకృకరదేవదత్త ధనుంజయులనెడు ఉపవాయువులునుగూడి ప్రాణమయకోశమనఁబడు. మనోమయకోశము=మనస్సు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియములైదును జేరి మనోమయకోశమగును. మఱియు హంసస్వరూపంబగు ప్రాణవాయువునందు మనసునిల్వగాను మనోమయకోశమగును. విజ్ఞానమయకోశము = ఆమనస్సుచేత జ్ఞానమెఱిఁగి ధ్యానమననాది వృత్తికలిగినప్పుడే విజ్ఞానమయకోశము. బుద్ధియును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా

ఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులైదునుగూడి విజ్ఞానమయకోశము. ఆనందమయకోశము=అజ్ఞానమందు పరమానందమునుపొందినాను అనెడిదియె ఆనందమయకోశము. మలినసత్వరజస్తమోగుణాత్మికమైన యవిద్యయే ఆనందమయకోశము. ప్రియ మోద ప్రమోదము అనెడు వృత్తులతోఁగూడిన యజ్ఞానమే ప్రధానముగాఁగల యంతఃకరణమే ఆనందమయకోశము. హిరణ్మయకోశము= ఈపైనఁజెప్పఁబడిన పంచకోశములకుపైగా హిరణ్మయకోశముండును. ఆకోశముయొక్క నాశనమప్పుడు నామరూపక్రియారహితమును ఆవరణరహితమును అగు అచలపరిపూర్ణమే నిలిచియుండును.

☞ ఉన్మని:—ఆజ్ఞాచక్రమునకుఁబైన నొకయంగుళమువఱకు శక్తియని దానిపైన మూఁడంగుళములవఱకు వ్యాపినియని ఆవల నాలుగంగుళములదాఁక సమనయని ఆమీఁద నాలుగంగుళములవఱకు ఉన్మనిఁయనియు సుషుమ్నకుఁబేరులు. కావున సుషుమ్నయొక్క అగ్రభాగమునకే ఉన్మనియని చెప్పుదురు. కపాలకుహరమందలి పైభాగమని తెలియునది.

☞ ఔమాత్రత్రయము=అ+ఉ+మ్=ఓం=ప్రణవము. ప్రణవము అక్షరత్రియంబై నాదబిందుకళాత్మకంబై సృష్టిస్థితిలయకారణభూతంబై యుండు. అకారము నాదము స్థూలదేహము; ఉకారము బిందువు సూక్ష్మదేహము; మకారము కళ కారణదేహము; ఓంకారము అర్ధమాత్రక మహాకారణదేహము; ప్రణవము అవాఙ్మానసగోచరము. ఈవిషయము బ్రహ్మవిద్యయందు తేటతెల్లముగ వ్రాయఁబడెను.

4. సీ॥ కదలకయాధార కమలంబులోనున్న
భుజగకన్యకలేపి పొడలఁదీర్చి
సమమైనమలకలఁ జక్కఁగానవరించి
షణ్మండలంబుల సంధిఁబట్టిచి
పరిచితషట్చక్ర పద్మాంతములయందుఁ
బరిపూర్ణబిందువుల్ పరఁగనుంచి
ప్రాణవాయుసౌఖ పటుకళాసంపూర్ణ
ఘంటానినాదంబు కలియఁదెలిసి
తెలివి ధ్రువమండలంబునఁ దేటపడఁగ
పడగలాడింటఁబవనాబు ప్రణవనాద

సాదపరిపూర్ణచిత్కళా నందమగుచుఁ
బమల నైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ కదలక=చలింపక, ఆధారకమలంబుఁ=మూలాధార చక్రమునందు, ఉన్న భుజగకన్యకఁ=ఉండునట్టి నాగకన్యకను—అనఁగా సుషుమ్నను, లేపి = ఊర్ధ్వమునకువ్యాపింపజేసి, పొదలఁ=వర్ధిల్లునట్లు, తీర్చి=తీరుమానించిసరిగా నుంచి—అనఁగా సుషుమ్ననునిదుర లేపి కుండలిని బెకళించియనిభావము, సమము=ఎచ్చుతక్కువలు లేనిది, ఐనమలకలఁ=అయినట్టివంకరలు—అనఁగా దేహముయొక్కవంకరలు, చక్కఁగాఁ=బాగుగా, సవరించి=దిద్ది, షణ్మండలంబులఁ=మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబులనెడియాఱుచక్రములుండుతావులను, సంధిఁబఱిచి = సరిపెట్టి—అనఁగా శరీరము వంకరలేకుండ నిలిపి నిక్కి కూర్చొని, పరిచిత షట్చక్రపద్మాంతములయందుఁ = అట్లుసరిచేసిన పద్మాకారములయిన మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబులను నాఱుచక్రములందు, పరిపూర్ణబిందువుల్=కొఱఁతలేని నీటిబొట్లవలె స్వచ్ఛమయిన

మనస్సును, పరగన్ = అన్నిటను వ్యాపించునట్టుగా, ఉంచి = నిలిపి, ప్రాణవాయుస్థానపటుకళాసంపూర్ణఘంటానినాదంబున్ — ప్రాణవాయుస్థాన = ప్రాణవాయువుయొక్క, పటుకళా = విశేషకళచేతను, సంపూర్ణ = నిండినటువంటి ఘంటానినాదంబున్ = యోగఘంటానాదమును, కలియన్ = కలిసికొనఁగా, తెలిసి = తెలివినొంది — అనఁగా యోగఘంటానాదమునువిని, తెలివి = జ్ఞాత — అనఁగా శుద్ధమనస్సు, ధ్రువమండలంబునన్ = త్రికూటస్థానమునందు — అనఁగా దహరాకాశమందు, తేటపడఁగన్ = స్పష్టముగాఁ దెలియునటుల, పడఁగలారింటన్ = ఆఱురంధ్రములయందును — అనఁగా నేత్ర శ్రోత్ర ఘ్రాణరంధ్రము లారింటియందును, పవనంబు = వాయువుతో, ప్రణవనాద = ప్రణవనాదమునుగూర్చి, నాదపరిపూర్ణ చిత్కళానందము = నాదము బిందువు కళలవలన కలిగిన ఆనందము, అగుచున్ = కలదియగుచు పదుల నైదింటన్ = అయిదుపదులతో అనఁగా పంచాశద్వర్ణరూపమయిన పరబ్రహ్మముతో, బ్రహ్మబిలము = బ్రహ్మరంధ్రము, శోభిల్లున్ = ప్రకాశించును.

తా॥ మూలాధారకమలమునందు కదలకయున్న కుండలినీశక్తిని నిదురలేపి మీఁదికి వ్యాపించి వర్ధిల్లునట్లుచేసి దేహమును వంకరలులేక సరిగానుండునట్లు నిక్కచక్కఁగా కూర్చొని మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబులను చక్రముల నెలవులు చక్కఁబఱచి యభ్యాసముచేయఁబడిన మనస్సును ఆచక్రములాఱింటను వ్యాపించునట్లునిలిపి ప్రాణవాయువుయొక్క నిండు కొన్ని కళలతోఁ యోగ ఘంటానాదమును గూర్చి దాని వలని తెలివిని అనఁగా చిత్ప్రకాశమును పొంది ఆచిత్ప్రకాశము త్రికూటస్థానమునందు స్పష్టముగాఁ దేలపడునట్లు నేత్ర శ్రోత్ర ఘ్రాణరంధ్రములాఱింటియందును బ్రణవ నాదమును గూర్చి నాదబిందుకళలవలన కలిగిన యానందము కలదియగుచు పంచాశద్వర్ణాత్మక పరబ్రహ్మముతోఁడఁ గూడి బ్రహ్మరంధ్రము వెలుఁగుచుండును అని తాత్పర్యము.

[illegible] భుజగకన్యక=నాగకన్యక, సుషుమ్న సర్పాకారముగానున్నందున వెన్నుపామని చెప్పుదురు.

షట్చక్రములు:—వీణాకుతంతులవలె సీవీణాదండము నకు గుదస్థానమునుండి కపాలమువఱకు నొకటిమీఁద నొకటిగా మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరకము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము ననెడు సప్తచక్రంబులుగలవు. అందు మొదటియాఱును షట్కమలములని యెన్నఁబడును. సుషుమ్నానాడి ఈయాఱు కమలములగుండ సంచరించును గనుక నీయాఱుకమలములకును సుషుమ్నానాళమండలినాడులతో సంబంధము గలదు. అనుభవమున నీవిషయము యోగులకుఁ జక్కఁగాఁ దెలియును. మూలాధారాదికమలములు కుండలినీ శక్తిని నిదురలేపి పెకళించి చూచినయెడల అనుభవమునకు గోచరమగును. మూలాధారచక్రముయొక్క అగ్రకోణమందు అనఁగా మధ్యను కుండలినీశక్తి యుండును. మూలాధారమునకు అధోకుండలియనియు భ్రూమధ్యమునకు ఊర్ధ్వకుండలియనియు చెప్పుదురు. విషయలోలురయియుండు జనులందరికి మూలాధారమందు కుండలినీ శక్తియొక్క తలయు భ్రూమధ్యమందుఁ దోఁకయు నుండును. మనస్సు అధోముఖవ్యాప్తిమై యుండును. విజ్ఞానము

గలవారికి భ్రూమధ్యమందు కుండలినీశక్తియొక్క తల యు మూలాధారమందు దోకయు నుండును. ఈకుండలి నే సర్పాకారమనియు నాగకన్యకయనియుఁ జెప్పుదురు.

1. మూలాధారము:— స్థూలశరీరంబునందు గుదస్థానముకంటె రెండంగుళంబుల మీఁదను లింగస్థానమున కంటె రెండంగుళంబుల క్రిందను అగ్రకోణము అధోముఖముగాఁగల మూఁడుకోణంబులతో శరీరమునకు మధ్యను మూలాధారచక్రమున్నది. అందు నాలుఁగుదళములుగల కమలముండును. వ శ ష స అనెడు నాలుగునుబీజములు. ఈకమలమున కధిపతియగు గణపతికి అజపాగాయత్రీ మంత్రజపమున 600 హంసలు సమర్పింపఁబడును. ఇదిపృథివికి స్థానముగాన దీనికిని ముక్కునకును సంబంధము. ఇదిమల విసర్జనకుఁ గారణము.

2. స్వాధిష్ఠానము:—మూత్రద్వారమందు ఆఱుదళములుగల కమలముండును. బ భ మ య ర ల అనెడునా ఱునుబీజములు. ఈకమలమున కధిపతియగు సరస్వతితోఁ గూడియుండు బ్రహ్మకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది జలమునకు స్థాన

ముగాన దీనికిని నాలుకకును సంబంధము. ఇది మూత్ర విసర్జనకు శుక్లశోణితముల విసర్జనకును గారణము.

3. మణిపూరకము:—నాభియందు బదిదళములుగల కమలముండును. డ ఢ ణ త థ ద ధ న ప ఫ అనెడుపది యును బీజములు. ఈకమలమున కధిపతియగు లక్ష్మితోఁ గూడియుండు విష్ణునకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది అగ్నికిస్థానము గాన దీనిక్కిని గన్నులకును సంబంధము. ఇందలి యగ్ని భుజించినసమస్తపదార్థములను జీర్ణముచేయును. ఇదియె చిత్తమునకు స్థానము.

4. అనాహతము:—వక్షస్థలమందు ఱొమ్మెముకకును పిణాదండమునకును మధ్యనుండెడిహృత్పద్మము. ఇది పండ్రెండుదళములుగలకమలము. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అనెడుపండ్రెండునుబీజములు. ఈకమలమున కధిపతియగు పార్వతితోఁ గూడియుండు రుద్రునకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది వాయువునకుస్థానముగాన దీనికిని త్వగింద్రియమునకును సంబంధము. ఇదియె ప్రాణవాయుసంచారము

నకును అహంకారమునకును స్థానము. ఈచక్రమందుఁ గొట్టఁబడకయే దశవిధప్రణవనాదములు మ్రోగుచుండును గనుక అనాహతచక్రమని చెప్పఁబడుచున్నది. ఈనాదానుభవము యోగాభ్యాసముగలవారికే తెలియును. నాదమనఁగా మూలాధారమునుండి హృదయమునఁ బుట్టిన సంగీతధ్వని. కుండలీయోగముచేత నాదబ్రహ్మమును లేపి యానందమును జెందవలయును.

5. విశుద్ధము:— కంఠస్థానమందుఁ బదియాఱుదళములుగల కమలముండును అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అనెడిపదునాఱునుబీజములు. ఈకమలమున కధిపతియగు నీశ్వరునకు నజపాగాయత్రీమంత్రజపమున 1000 హంసలు సమర్పింపఁబడును. ఇది యాకాశాంశము గానఁ జెవులతో సంబంధము కలిగియుండును. ఇదియె మనస్సునకు స్థానము. సమస్తభూతములయందుండెడి యాత్మస్వరూపమే కృష్ణుఁడనియు నాకృష్ణుఁడు సహస్రారకమలమందుండుననియు విశుద్ధచక్రంబునందలి పదియాఱుదళంబులను వీక్షించుచుండుననియు నీపదియాఱు దళంబులే పదియాఱువేల గోపికలనియు నిరూపింపవలననే

కృష్ణుఁడు గోపికలతోఁ బొందెననియు నాకృష్ణుఁడస్ఖలిత బ్రహ్మచారియనియు సదోపవాసియనియుఁ జెప్పుదురు.

6. ఆజ్ఞాచక్రము.— భ్రూమధ్యమందు రెండుదళములు గల కమలముండును. హం క్షం యనునవిబీజములు. ఈ కమలమున కధిపతియగు సదాశివునకు నజపాగాయత్రీ మంత్రజపమున 1000 హంసలు సమర్పింపఁబడును. ఇది బుద్ధికి స్థానము. మనస్సునకుఁ గంఠము స్థానమైనను సకలేంద్రియవ్యాపారములఁ జేయుటయందు ఆజ్ఞాచక్రమునకు వచ్చును గనుక మనసునకు విషయములగు సంకల్ప వికల్పములే యీచక్రమునకు దళములని చెప్పఁబడెను. మొదటి యైదుచక్రములయందు హఠయోగులు క్రమక్రమముగ మనసునిలిపి వాయునిరోధముఁజేసి అభ్యసించెదరు. రాజయోగులు ఆజ్ఞాసహస్రార చక్రములయందే అభ్యాసముచేసెదరు. ఇదియే ముక్తికాంతకు స్థానము. ఇచ్చటి ముక్తికాంత లేక జ్ఞానకాంతతో సంయోగమే జీవన్ముక్తి. ఇదియే జీవేశ్వరైక్యము. దీనినే త్రినేత్రమనియుఁ జెప్పుదురు.

☞ ఈషట్చక్రములయందలి యేబదిబీజములతో సహస్రారమునకు సంబంధముండుటనుబట్టి బ్రహ్మబిలము పదులనైదింట శోభిల్లునని తెలియవలయును.

సహస్రారము:— ఈయమల మాజ్ఞాచక్రమునకుమీఁదుగఁ గపాలకుహరమందుండును. ఈకమలమున కెనిమిది దళములుగలవు. ఒక్కొక్కదళమునందు 125 రేకులు. అట్లుకమలమునకు 1000 రేకులుకలిగియుండును. ఈచక్రాధిపతియగు పరమాత్మకు అజపాగాయత్రీమంత్రజపమున 1000 హంసలు సమర్పింపఁబడును. ఎనిమిదిదళములుకలిగి యుండుటచేత నష్టదళపద్మమనియు 1000 రేకులుగలిగి యుండుటచేత సహస్రారమనియుఁ జెప్పఁబడును.

*Note:*— ఈయెనిమిది దళములందు ఎనిమిదివృత్తులు కలవు. ఆవృత్తులనుబట్టియే యెనిమిదిదళములని చెప్పఁబడును.

సహస్రారకమలమునుగూర్చి విశదముగ బ్రహ్మవిద్యయందు వ్రాయఁబడెను.

5. సీ॥ కరతలంబుననున్న ఘనమిష్టలింగంబు
నయనస్థలంబున ననువుపఱచి

నయనస్థలంబున నలరుసత్ప్రాణంబు
హృదయస్థలంబునఁ గుదురుపఱిచి
హృదయస్థలంబునఁ బొదలుసద్భావంబు
మంత్రస్థలంబున మరులుకొలిపి
మంత్రస్థలంబున మరులొందుచిద్బిందు
కూటత్రయంబునఁ బాటుపఱిచి
పాటుకూటత్రయంబునఁ బ్రణవతేజ
తేజతేజోలయవ్యాప్తి తేజమర్థ
మర్థమర్థాదిమర్థమై మర్థమగుచుఁ
బదులనైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ కరతలంబునన్ = అఱచేతియందు, ఉన్న ఘనము = ఉండునట్టిగొడ్డదయిన, ఇష్టలింగంబు = మాయను, — అనఁగా దనయఱచేతనుండునట్టి పదార్థమువలెఁ గన్నులయెదుటఁ గనఁబడుచుండియుఁ గానరానిదయిన ప్రకృతిని అనఁగా మనస్సును, నయనస్థలంబునన్ = దృక్స్థానమునం దు, అనువుపఱిచి = పొందుపఱిచి అనఁగాపొందించి, నయనస్థలంబునన్ = కంటితావునందుఅనఁగా చూపునందు, అలరు = ఒప్పుచున్నట్టి, సత్ప్రాణంబున్ = ప్రాణవాయువును,

హృదయస్థలంబునన్ = హృదయాకాశమందు, కుదురుపఱిచి = చలింపకుండునట్లునిలిపి, హృదయస్థలంబునన్ = హృదయాకాశస్థానమునందు — చిదాకాశమునందు, పొదలు = వర్ధిల్లుచున్న, సద్భావంబున్ = మంచి యభిప్రాయమును అనఁగా బ్రహ్మజ్ఞానమును, మంత్రస్థలంబునన్ = మననస్థానమునందు, మరులుకొలిపి = అలవాటుపఱిచి, మంత్రస్థలంబునన్ = మననమునకుఁజోటయిన యారహస్యస్థానమునందు, మరులొందుచిక్కిందున్ = అలవాటుపడిన చిదాకాశమును, కూటత్రయంబునన్ = త్రికూటస్థానమునందు, పాటుపఱిచి = పొందుపడునటుజేసి, పాటుకూటత్రయంబునన్ = అట్లు చిదాకాశమువలనఁ బొందుపడిన త్రికూటస్థానమునందు, ప్రణవతేజ = ప్రణవరూపమయిన పరబ్రహ్మముయొక్క తేజ = తేజస్సుతో, తేజోలయవ్యాప్తిన్ = ఇతర తేజములు లయించునట్టివ్యాపనముయొక్క, తేజ = వెలుఁగువైన, మర్మమర్మ = మిక్కిలిరహస్యమైన, మర్మాదిమర్మము = రహస్యములకెల్ల మొదటిరహస్యము, అగుచున్ = అవుచును, పదులనైదింటన్ = పంచాశద్వర్ణాత్మకత్వముచేత, బ్రహ్మబిలము = బ్రహ్మరంధ్రము, శోభిల్లున్ = ప్రకాశించును.

తా॥ దృశ్యపదార్థములవలనఁ బ్రత్యక్షముగాఁదోఁచు చుండియుఁగన్నులకుఁ గానరానిదైన ప్రకృతిని దృక్కు-నందుఁగూర్చి యట్లు ప్రకృతినిగనుఁగొన్నదృక్కునందుం జేసి ప్రాణవాయువును హృదయాకాశమునందుఁ జేర్చి హృదయమునందుం వర్ధిల్లుచున్న బ్రహ్మజ్ఞానమును మనన మునఁ బాటుపఱిచి మననమువలననలవాటుపడిన చిత్త ను త్రికూటమునందుఁ బొందించి యందుబొందిన ప్రణవ తేజమైయున్న పరబ్రహ్మతేజమునం దితర తేజములన్నింటిని లయింపఁజేసి యట్టిసర్వతేజోలయస్థానమగు నేకాంత స్థానమునకు ముఖ్యస్థానమగుచుఁ బాహ్యాకాశద్వారాత్మకత్వ ముచేత బ్రహ్మరంధ్రము శోభిల్లుచుండునని తాత్పర్యము.

6. సీ॥ ఆధారమధ్యస్థ మాజ్ఞేయకర్ణికా
నిటలభ్రూమధ్యాబ్ధి నీరజముల
ప్రథమసమోపేత పంచమార్ణవయుక్త
శక్తినాధారసంయుక్తమగుచు
రవిబ్రహ్మబీజముల్ రంజిల్లికవగూడి
కూటాక్షరస్థాన కోటరమున

నాదిస్వరూపేత జీవాదిసంయుక్త
భువనైకకర్ణికా బుద్బుదమున
దమనషడ్వర్గపదతప్త తపనకుంభ
కుంభకాధారసంధాన కువలయమున
యమునగంగలు కవగూడి యేకమగుచు
పదులనైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ బ్రహ్మబిలము=బ్రహ్మరంధ్రము ఆధారమధ్యస్థము=మూలాధారముయొక్క మధ్యయందున్నదై అనఁగా మూలాధారమువఱకును వ్యాపించినదై, ఆజ్ఞేయకర్ణికాపుటల భ్రూమధ్యాబ్జసీరజములఁ =ఆజ్ఞాచక్రమనియెడు కర్ణికగలవియును ఫాలభాగమునకును కనుబొమలనడిమిప్రదేశమునకును మధ్యయందుండునట్టి జ్ఞానసముద్రమునందలి పద్మములయందు అనఁగా భ్రూమధ్యమునందలి రెండుదళములుగల యాజ్ఞాచక్రమనియెడు పద్మమునందు, ప్రపంచసమోపేతపంచమార్ణవయుక్తశక్తిఁ=మొదలినుండినసమముగాఁ జేరియున్న యైదుసముద్రములతోఁ గూడియున్న సామర్థ్యముచేత అనఁగా ఎఱుపు తెలుపు నలుపు సుసలము యింద్రనీలము అను పంచరంగులయొక్క సామర్థ్య

ముచేత ఆధారసంయుక్తము= మూలాధారచక్రముతోఁ గూడినది, అగుచున్=ఆయినదగుచు, రవి బ్రహ్మబీజముల్ =సూర్యునియొక్కయును బ్రహ్మయొక్కయును బీజముల (అనఁగా హకార సకారములతో) రంజిల్లి=ప్రకాశించి, కూటాక్షరస్థానకోటరమునన్ =వశింపని దహరాకాశ గుహాయందు, కనఁగూడి=జంటఁగా జేరి, ఆదిస్వరూపేత శ్రీనాదిసంయుక్తభువనైక కర్ణికాబుద్బుదమునన్ = తొలుత రూపముతోఁ గూడియున్న జీవజంతువులతోఁ గూడినదియును సృష్టిబుగ్గ యైనదియును ఐన లోకమనియెడు కర్ణికయందు, దమనషడ్వర్గ షడశిష్టతపనకుంభకుంభకాధారసంధాన కువలయమునన్ =శమ దమ ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానములను నాలుస్థానముల చేతను దపింపఁజేయఁబడినదియును శాతకుంభమువంటిదియును కుంభకాధారములను జేర్చఁదగినస్థానమగు పృథివియందు, యమునగంగలు=ఇడాపింగళలు, కవగూడి=జంటగాఁ జేరి, ఏకమ్ =ఒక్కటిగా, అగుచున్ =అయినదిగుచు, పదులనై దింటన్ =పంచాశద్వర్ణముల చేత, శోభిల్లున్ = ప్రకాశించును.

తా॥ బ్రహ్మరంధ్రము మూలాధారమువఱకును వ్యాపించినదై ఆజ్ఞాచక్రమనియెడు కర్ణికగలదియును ఫాలభాగమునకును కనుబొమలనడిమిప్రదేశమునకును మధ్యయందుండునట్టిజ్ఞానసముద్రమునందలి పద్మమునందు సమముగాఁజేరియున్న పంచగంగులయొక్క సామర్థ్యముచేత మూలాధారచక్రముతోఁ గూడినదగుచు, హకార సకారములతో ప్రకాశించి నశింపని దహరాకాశగుహాయందు జంటగాఁజేరి తొలుతటిరూపముతోఁ గూడియున్న జీవజంతువులతోఁ గూడినదియును నెటిబుగ్గవంటిదియును అయిన లోకమనియెడు కర్ణికయందు శమ దమ ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానములను నాల్గింటియొక్క సంపత్తి గలిగి శాతకుంభమువంటిదియును కుంభకాధారములను జేర్చఁదగినస్థానమందు యిడాపింగళలు జంటగాఁజేరియేకమగుచు పంచాశద్వర్ణములచేత ప్రకాశించును అని తా॥

7. సీ॥ సకలమాత్రాధార సహజస్వరూపమౌ
బిందువుకుండలై బెరసియుండు
సకలనిష్కళరూప శాంభవీబింబమౌ
బిందువుకుండలై బెరసియుండు

• సకలకోశములోని సహజహంసాంతమగా
బిందుపుకుండలై బెరసియుండు
సకలజీవాధార సంధానకందమగా
బిందుపుకుండలై బెరసియుండు
బెరసిబిందూర్ధ్వకర్ణికా భేద్యగతుల
గతులగోరక్షువర్ణంబు కంబుజాల
జాలసూర్యమరీచిస్థ జాతమగుచు
పథులనై దింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ సకలమంత్రాధారసహజస్వరూపమగా = సమస్తమైనమంత్రములకును ఆధారమే సహజస్వరూపముగాఁగల, బిందుపు=పరిపూర్ణము, కుండలై =సుషుమ్నమై, బెరసి=ప్రకాశించి,ఉండుఁగ = ఉండును, సకలనిష్కళరూప శాంభవీబింబమగా=సమస్తమందును నిష్కళరూపముగల మూలప్రకృతియొక్క యాకారమగు, బిందుపు= పరిపూర్ణము:—కళలతోఁగూడినప్పుడు మూలప్రకృతియనియు, కళారహితమప్పుడు పరిపూర్ణమనియుఁ బరబ్రహ్మమనియుఁ దెలియునది. కుండలై =సుషుమ్నమై, బెరసియుండుఁగ= ప్రకాశించియుండును. సకలకోశములోని సహజహంసాం

తవహా అన్ని దేహములయందు సహజమగు హంసస్వరూపముయొక్క అగ్రమగు, బిందువు=పరిపూర్ణము, కుండలై=సుషుమ్నమై, బెరసియుండును= ప్రకాశించియుండును, సకలజీవాధారసంధానకండమహా బ సమస్తమైనజీవులకు ఆధారమునుకలిగించుటకు సంపవాటిదియగు, బిందువు=పరిపూర్ణము, కుండలై=సుషుమ్నమై, బెరసియుండును= ప్రకాశించియుండును, బిందూర్ధ్వకర్ణికాభేద్యగతులను = బిందుస్థానమునకు పైనున్నకర్ణికను భేదింపదగినరీతులచేతను, బెరసి=ప్రకాశించి, గతులను=ఆరీతులచేతను, కంబుజాల=కంఠనాళమందు, గోరతువర్ణంబు=ఇంద్రియములను కాపాడునట్టియాకృతి కలదియును, జాలసూర్యమరీచిస్థజాతమగుచును=పరమాణుస్వరూపమైనది యగుచు, బ్రహ్మబిలము=బ్రహ్మరంధ్రము, పసులనైదింటను=పంచాశద్వర్ణాత్మకత్వముచేత, కోభిల్లును=ప్రకాశించును.

తా॥ సకలమంత్రములకును మూలాధారమగుపరిపూర్ణము సుషుమ్నమై ప్రకాశించియుండును. మూలప్రకృతియొక్క కళారహితరూపమగు పరిపూర్ణము సుషుమ్నమై వెలయుచుండును. శరీరములయందు సహజముగానుండె

ను హంసస్వరూపమగు పరమాత్మ సుషుమ్నమైయొప్పు చుండును. సమస్తప్రాణులకు మూలాధారమగు పరిపూర్ణము సుషుమ్నమని చెప్పఁబడును. పైగానుండెడి కర్ణికను భేదించి కంఠనాళమందుండి యింద్రియములను కాపాడుచు పరమాణుస్వరూపమై పంచాశద్వర్ణాత్మకత్వము చేత బ్రహ్మరంధ్రము ప్రకాశించును.

☞ జాలసూర్యమరీచిస్థజాతము:—జాలసూర్యమరీచిస్థం యచ్చసూక్ష్మతరంగజః తస్యషష్టాష్టమోభాగ స్త్వణురిత్యభిధీయతే। తస్యషష్టాష్టమో భాగఃపరమాణుః ప్రకీర్తితః॥ గృహరంధ్రములయందు వ్యాపించినసూర్య కిరణములోఁ దిరుగుచుండెడి సూక్ష్మతమ రేణువులో ఆఱవ భాగముగాని యెనిమిదవభాగముగాని అణువగును. అట్టి అణువులో ఆఱవభాగముగాని యెనిమిదవభాగముగాని పరమాణువు. పరమాత్మ అణుస్వరూపుఁడని తెలియునది. మఱియును "అణోరణీయాం మహతోమహీయామ్" అను మొదలుగాఁగల శ్రుతులను తెలియునది.

8. సీ॥ బిందూర్ధ్వకుండలై భేద్యమాచిచ్ఛక్తి
యాధారమూలమందమరియుండు

సమరియుండినయట్టి యజ్ఞాష్టదళమధ్య
ప్రణవంబుహంసమై ప్రబలియుండు
ప్రబలియుండినయట్టి పంచార్ణవంబులే
ప్రాసాదచిచ్చంద్ర చంద్రికగును
చంద్రికాహారంబు గలచకోరంబుతొ
మనసాదికరణైక మండలంబు
అంబుజాంతస్థనిటల షట్కాంబుజముల
కంబుజాంబూనదగ్రీవ కందరమున
కందరావాసమైన చిత్కందరమున
పదులనైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ బిందూర్ధ్వకుండలై = బిందుస్థానమునకు ఊర్ధ్వ భాగమునందలి సుషుమ్నారూపమై, భేద్యమా=భేదింపం దగినదైన, చిచ్ఛక్తి=చిచ్ఛక్తి, ఆధారమూలమందుర్=మూలాధారచక్రమందు, అమరియుందుర్=ఒప్పియుండు ను,అమరియుండినయట్టి= చక్కనైయున్న, అజ్ఞాష్టదళమధ్యా= పద్మము యొక్క అష్టదళములమధ్యను, ప్రణవంబు= ప్రణవము,హంసమై=హంసస్వరూపమై, ప్రబలియుందుర్ = అతిశయించియుండును, ప్రబలి= అతిశయించి, యుండిన

యట్టి=ఉన్నటువంటి, పంచార్ణవంబులే=పంచసముద్రములే
—అనగా పంచరంగులే, ప్రాసాదచిచ్ఛంద్రచంద్రిక=ఉ
పరిభాగమందలి చిత్తుఅనియెడు చంద్రునియొక్క ప్రకాశ
ము, అగును=అగును, చంద్రికాహారంబుగలచకోరంబులా
=వెన్నెలలేయాహారముగాఁగలచక్రవాకపక్షులవలె, మన
సాదికరణైకమండలంబు=ఉండెడిమనస్సు మొదలుగాఁగల
యింద్రియంబులకు ఆధారస్థానమై, అంబుజాతస్థ నిటల
షట్కాంబుజములన్ =కమలములలో పలశ్రేష్ఠమైన మూ
లాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞే
యంబులను షట్కమలములచేతను, కంబుజాంబూనద
గ్రావకందరమునన్ = కంఠమునందలిబంగారమువంటిసుషు
మ్నముగలగుహచేతను, కందరావాసమైన చిత్కందరము
నన్ = గుహలకునివాసమగునట్టి ఆత్మగుహచేతను, పదుల
నైదింటన్ = పంచాశద్వర్ణములచేతను, బ్రహ్మబిలము=
బ్రహ్మరంధ్రము, శోభిల్లున్ = ప్రకాశించును.

తా॥ బిందుస్థానమునకు ఊర్ధ్వభాగమునందలి సుషు
మ్నారూపమై భేదింపఁదగినదైన చిచ్ఛక్తి మూలాధార
చక్రమందు చక్కఁగనుండును. పద్మముయొక్క అష్టదళ

ములమధ్యను ప్రణవము హంసస్వరూపమై అతిశయించి యుండును. పంచరంగులే ఉపరిభాగమందలి చిత్తు అనియె డు చంద్రునియొక్క ప్రకాశము అగును. చక్రవాకపక్షుల కువెన్నెలవలె మనస్సు మొదలుగాఁగల యింద్రియంబుల కుసంతోషమును కలుగఁజేయుస్థానమై, షట్కమలముల చేతను కంఠమునందలి సుషుమ్నముగల గుహచేతను గుహాలలోశ్లేషమగు అత్తగుహచేతను పంచాశద్వర్ణముల చేతను బ్రహ్మరంధ్రము ప్రకాశించును అని తాత్పర్యము.

9. సీ॥ శతపత్రకర్ణికా స్థితస్వర్ణకోశాగ్ర
మున్ననిమణిదీప్య చిన్నయంబు
చిన్మయానందాఖ్య చిరచిదుజ్జ్వలసుధా
కౌశేయపరిపూర్ణ కంకణంబు
కంకణాంతరదీప్య కాలానలాభాస
మరుదగ్నిరవిశశి మండలంబు
మండలాష్టకమధ్య మంధానసంచార
మున్మనీచిచ్ఛక్తి యుద్భవంబు
అంబుధరమధ్యనీలాంబ రాబ్జపూర
పూరకాధారసమపూర్ణ పుష్పభూరి

భూరిదళమూలకుంభకాంభోజమధ్య
పదులనైదింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ శతపత్రకర్ణికాస్థితస్వర్ణకోశాగ్రము=నూఱుదళములుగలపద్మముయొక్క దుద్దునందున్న హిరణ్మయకోశముయొక్కయగ్రభాగము, ఉన్మనీమణిదీప్య చిన్మయంబు ఉన్మనీయనుమణిచేత అనఁగా సుషుమ్నచేత ప్రకాశించెడు చిన్మయాకారము, చిన్మయానందాఖ్యచిరచిదుజ్జ్వల సుధాకోశయుపరిపూర్ణకంకణంబు=చిన్మయానందము అనఁగా చిత్తువలనఁగలిగినయానందము అనుపేరుకల అనాదిసంబంధమగు చిత్తు(మాయ) చేత ప్రకాశించుచున్నయమృతము స్రవించెడు కోశయముచేత నిండిన బిందుస్థానము, కంకణాంతరదీప్య కాలానలాభాస మరుదగ్నిరవిశశిమండలంబు=బిందుస్థానముయొక్క మధ్యయందుఁ బ్రకాశించుచున్న కాలాగ్నివలె ప్రకాశించెడు వాయు మండలము అగ్నిమండలము సూర్యమండలము చంద్రమండలములు కలచి, మండలాష్టకమధ్య మంథానసంచారము=ఎనిమిదివిధములయిన మండలములయొక్క మధ్యయందు కవ్వమువలెఁ దిరుగుచున్న, ఉన్మనీచిచ్ఛక్తి యుద్భవంబు=

ఉన్మనీయనెడు చిచ్ఛక్తియొక్క పుట్టువుకలది, అంబుధర
మధ్య=కంటియొక్క మధ్యను, నీలాంబరాబ్జపూర=నల్లని
కమలముతోనున్నది,పూరకాధార=పూరించుటకు ఆధా
రమైనదియును, సమపూర్ణ = సమముగానిండినదియును,
పుష్పభూరి=సువర్ణ పుష్పమువంటిదియును,భూరిదళమూల
కుంభకాంభోజమధ్య= స్వర్ణదళములయొక్క మొదటకుం
భకమును కలిగించునట్టి పద్మమధ్యభాగముకలది అయిన,
బ్రహ్మబిలము=బ్రహ్మరంధ్రము, పదులనైదింటన్ =పంచా
శద్వర్ణములచేత, శోభిల్లున్=ప్రకాశించును.

తా॥ నూఱుదళములుగల పద్మముయొక్క దుద్దునం
దున్న హిరణ్మయకోశముయొక్క యగ్రభాగమే సుషు
మ్నచేతఁ బ్రకాశించెడి చిన్మయాకారము. చిన్మయాసం
దమగు అనాదిసంబంధమగు మాయచేతఁ బ్రకాశించెడు
అమృతమును కలిగించునట్టి కాశేయముచేత నిండిన బిం
దుస్థానము. ఆబిందుస్థానముయొక్క మధ్యయందుఁ బ్రకా
శించుచున్న కాలాగ్నివలెనుండు వాయుమండలము అగ్ని
మండలము సూర్యమండలము చంద్రమండలములుకలది.
ఎనిమిదివిధములయిన మండలములయొక్క మధ్యయందు

కవ్వమువలెఁ దిరుగుచుండెడి చిచ్ఛక్తియొక్క పుట్టుకకు స్థానమైనది. కంటియొక్క మధ్యను నల్లనికమలముతోను న్నది. పూరించుటకు ఆధారస్థానమైనది. సమముగానిండి నదియును సువర్ణపుష్పమువంటిదియును, స్వర్ణదళముల యొక్క మొదట కుంభకమునుగలిగించునట్టిపద్మమధ్యభాగముకలది అయినబ్రహ్మరంధ్రము పంచాశద్వర్ణములచే తఁ బ్రకాశించుననని తాత్పర్యము.

10. సీ॥ ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు
యున్నచిచ్ఛక్తి యుద్భవంబు
ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు
ప్రాసాదచిచ్ఛక్తి ప్రాభవంబు
ప్రణవజ్యోతిస్తంభప్రభమధ్యపటలంబు
పరహంసమాసీన పంకజంబు
ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు
సకలజీవాధార సంభవంబు
ప్రణవజ్యోతిర్మయప్రభలచే ప్రబలమగుచు
ప్రబలతరమైనప్రతిఫల ప్రమదమగుచు

ప్రమదసందోహాశివకళా ప్రవిమలముగ
పదములనై దింటశోభిల్లు బ్రహ్మబిలము.

టీ॥ ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు=ప్రణవ మనియెడు దీపస్తంభమునందలి కాంతియొక్క మధ్యభాగము, ఉన్మనీచిచ్ఛక్తియుద్భవంబు=ఉన్మనీయనెడుచిచ్ఛక్తియొక్క పుట్టువునకుస్థానము. ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు = ప్రణవమనియెడు దీపస్తంభమునందలి కాంతియొక్క మధ్యభాగము, ప్రాసాదచిచ్ఛక్తి ప్రాభవంబు=మేడయందుండెడి చిచ్ఛక్తియొక్క మహిమకలది, ప్రణవజ్యోతిస్తంభ ప్రభమధ్యపటలంబు = ప్రణవమనియెడు దీపస్తంభమునందలి కాంతియొక్కమధ్యభాగము, పరహంసమాసీనపంకజంబు=పరమునుదెలుపునట్టిహంస స్వరూపము నివసించెడు కమలము, ప్రణవజ్యోతిస్తంభప్రభ మధ్యపటలంబు = ప్రణవమనియెడు దీపస్తంభమునందలి కాంతియొక్కమధ్యభాగము, సకలజీవాధారసంభవంబు= సమస్తమగు జీవులయొక్కయును పుట్టుకకు ఆధారము, ప్రణవజ్యోతిర్మయప్రభలచే = ప్రణవమనియెడు జ్యోతిర్మయములయిన కాంతులచేతను, ప్రబలము=అధికమైనది,

అగుచున్ = అయినదగుచు, ప్రబలతరము = మిగులనధికము, ఐనప్రతిఫలప్రమదము = అయినట్టి ప్రతిఫలముచేత సంతోషించినది, అగుచున్ = అయినదగుచు, ప్రమదసందోహశివకళాప్రవిమలముగన్ = అధికములయిన సంతోషసముదాయమునుకలిగించునట్టిశివకళచేత నిర్మలమైనది గానగుచు, బ్రహ్మబిలము = బ్రహ్మరంధ్రము, పదములనైదింటన్ = పంచాశద్వర్ణములచేత, శోభిల్లున్ = ప్రకాశించును.

తా॥ ప్రణవమనియెడు దీపస్తంభమునందలి కాంతియొక్క మధ్యభాగమే ఉన్మనీయనెడు చిచ్ఛక్తిపుట్టువునకు స్థానము. అదియే ప్రాసాదచిచ్ఛక్తియొక్క మహిమకలది. అచ్చటనే పరమునుదెలుపునట్టి హంసస్వరూపము నివసించెడు కమలము. మఱియును సమస్తమగు జీవులయొక్కయును పుట్టుకకు అదియే ఆధారము. ప్రణవమనియెడు జ్యోతిస్స్వయములయిన కాంతులచేతను అధికమైనదగుచు ప్రతిఫలముచేత సంతోషించినదగుచు అధికములయిన సంతోషసముదాయమును కలిగించునట్టి శివకళచేత నిర్మలమయినదిగానగుచు బ్రహ్మరంధ్రము పంచాశద్వర్ణములచేత ప్రకాశించునని తాత్పర్యము.

# చూర్ణిక.

శ్రీమదఖండ సచ్చిదానంద నిత్య పరిపూర్ణ దహరాకాశసూక్ష్మరంధ్రాంతర్గతవిహారణచిద్గంగాగర్భసంభూత చిన్ని కేజకర్ణికాకుహారజనితే। హంసాక్షరసమూహితే॥ ౧

శాంభవీబింబసంభూత చిద్బిందు సింధు వీచీ సముజ్జనిత డిండీరఖండాగ్ర పరమసుఖాసనాసీన హంసముఖనిశ్వాసప్రణవకుండలీ ముఖమండల మండితహృదయపుండరీకాఖండలే। సోమసూర్యాగ్నిమండలే॥ ౨

ఏతదూర్ధ్వ బ్రహ్మరంధ్రస్థానాగ్ని సూర్యచంద్ర జ్యోతిర్మండలాంతర్గతాసంఖ్యాతసహస్రగణాదోహంసాక్షర సహస్రదళపద్మకర్ణికావిలీనమానే। అపరిమితవిమానే॥ ౩

ఆధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశుద్ధాజ్ఞేయ పశ్చిమాపరసోమ సూరాగ్న్యాత్మాకాశ వాయ్వగ్ని సలిలపృథివ్యాది బిందు ధాతుక్షేత్ర సూత్ర కళావిద్యా పరిపూర్ణాత్మేశ్వర సుసంయోగమానే విద్వజ్జన సమీచీనే॥

పీతశ్వేతరక్తహరితపింగళకర్బురవిరజ విశ్వవ్యాప్తసుశీల
తోయద విద్యుల్లేఖేవభాస్వర పాణాపానసమానాదిపరి
కిరణ వ్యానోద్యానపీఠే। పశ్యల్లలాటే॥ ౫

చిన్మయానంద మస్మానోంబుజోన్మని మణిమందిరానం
దకందళసమాకీర్ణ తప్తసౌవర్ణగర్భ చింతామణీమంటప స
హస్రస్థూణసహస్రకింజల్కమానే। జగద్యోతమానే ౬

భ్రూకుటీకుటిల నిటల శుద్ధస్ఫటిక ఘట పటుతర నవ
రత్న శయ్యాసమాసీన చటులచిద్బిందు పీఠస్థిత శాంభవీ
చరణ సంఘృష్టమునికోటి కిరీట పతక నవరత్న రంగవల్లీ
సుశోభనాగారే। సంతతహృదంబుజవిహారే॥ ౭

శ్రీమచ్ఛివపురలోకమంచిన పండితారాధ్య వంశామృతా
బ్ధిసంపూర్ణచంద్రమా శ్రీవీర భద్రేశ్వరచరణ చిన్నికేజమా
ఘ్వకపానమత్తమధుపాయమానమానసాంబురుహాశుమా
లాంగుష్టగళేష్టలింగాష్ట దళపద్మకర్ణికావిలీనమానే। అప
రిమితవిమానే॥ ౮

నిత్యసర్వజ్ఞత్వాదిపరిపూర్ణ షట్కళాసంధాన ।జననీజ
ఠరకఠోర పీడాపహరణ విరచిత చంద్రశేఖరాంతర్గతస్వా

-నుభవ నిత్యానిత్యవివేకసు సంయోగసాక్షే శ్రీగురుకరుణా కటాక్షే। నమస్తేనమస్తేనమః॥

టీ॥ శ్రీమదఖండ.....జనితే = శ్రీమత్ = సంపత్కరమును, అఖండ=అఖండమును, సత్ =సత్స్వరూపమును అనఁగా భూత భవిష్య ద్వర్తమానకాలములయందును సర్వకాలసర్వావస్థలయందుండునదియును, చిత్ =స్వయంప్రకాశమును అనఁగా నితరసహాయము లేకయే తనకుదానే ప్రకాశించునదియును, ఆనంద=బ్రహ్మానందమే స్వరూపముగాఁగలదియును, నిత్య=శాశ్వతమును, పరిపూర్ణ సమస్తజంతువులయందును వస్తువులయందును పర్వతములయందును బాహ్యాభ్యంతరములయందు నిండినదియును అయిన, దహరాకాశ=హృదయాకాశముయొక్క, సూక్ష్మరంధ్ర=అతిసూక్ష్మమగురంధ్రముయొక్క, అంతర్గత=లోపలనున్నదై, విహారః=విహరించుచున్న, చిత్ = చిత్తమైనట్టియు, గంగాగర్భసంభూత=భాగీరథియందుబుట్టిన, చిత్ =చిత్తనియెడు, నీరజ=పద్మముయొక్క, కర్ణికాకుహర=దుద్దనియెడిగుహయందు, జనితే=పుట్టినదానవును, హంసాక్షరసమూహితే= హకారబిందు సకారములచేతఁజుట్టఁ

బడినదానవును, శాంభవి......పుండరీకాఖండలే—శాంభవీబింబ=మాయాబింబమువలన, సంభూత=పుట్టిన, చిద్బిందు=చిద్బిందుమనసరియెడు, సింధు=సింధునదియొక్క, వీచీ=అలలచేత, సముజ్జనిత=పుట్టింపఁబడిన, డిండీర=నురుగుయొక్క, ఖండ = తునుకలయొక్క, అగ్ర=అగ్రభాగమునందు, పరమసుఖాసనాసీన=విశేషముగా సుఖమునుకలిగించునట్టి యాసనమునందు నివసించియున్న, హంస=హంసస్వరూపముయొక్క, ముఖ=ముఖమునందలి,నిశ్వాస=నిశ్వాసవాయువులకల, ప్రాణవకుండలీ=ప్రాణవకుండలియొక్క, ముఖమండల=ముఖమండలమునందు, మండిత=అలంకరింపఁబడిన, హృదయపుండరీకాఖండ=అఖండమైన హృదయపుండరీకములకలదానవును, సోమసూర్యాగ్నిమండలే=చంద్రసూర్యాగ్నులయొక్క మండలములుకలదానవును, ఏతదూర్ధ్వ......లీనమానే—ఏతదూర్ధ్వ = ఈ ప్రాణవకుండలికి పైభాగమునందున్న, బ్రహ్మరంధ్రస్థాన=బ్రహ్మరంధ్రస్థానమునందలి, అగ్ని=అగ్నియొక్కయును, సూర్య=సూర్యునియొక్కయును, చంద్ర=చంద్రునియొక్కయును, జ్యోతిర్మండల=ప్రకాశమండలముయొక్క, అంత

ర్గత=లోపలనున్న, అసంఖ్యాత=లెక్కలేని, సహస్ర=వేల
యొక్క,గణ=సముదాయముయొక్క, ఆరోహణ=ఎక్కు
టలుగల, అక్షర=అక్షరములతో, సహస్రదళ=వేయిదళ
ములుగల, పద్మ=పద్మముయొక్క, కర్ణికా=దుద్దునందు,
విలీనమానే=అణఁగియున్నదానవును, అపరిమితవిమానే=
అసంఖ్యాతములైన విమానములుగలదానవును, ఆధా
......యోగమానే—ఆధార=ఆధారము, స్వాధిష్ఠాన=
స్వాధిష్ఠానము, మణిపూరక=మణిపూరకము, అనాహత=
అనాహతచక్రము, విశుద్ధ=విశుద్ధచక్రము,ఆజ్ఞేయ=ఆజ్ఞా
చక్రము, పశ్చిమ=పశ్చిమభాగము,అపర=అపరభాగము,
సోమ=చంద్రుఁడు,సూర్య=సూర్యుఁడు,అగ్ని=అగ్ని,ఆత్మ=
ఆత్మము,ఆకాశ=ఆకాశము, వాయు=వాయువు, అగ్ని=
అనలము,సలిల=ఉదకము, పృథివి=భూమి, ఆది=మొదలు
గాఁగల,బిందు=బిందువు, ధాతు=ధాతువు, క్షేత్ర=క్షేత్ర
ము,సూత్ర=సూత్రము, కళా=కళలు,విద్యా=విద్యలు, వీని
యందు పరిపూర్ణ=నిండిన, ఆత్మేశ్వర=ఆత్మారామునియొ
క్క, సుసంయోగమానే=చక్కనిసంబంధము కలదానవు
ను, విద్వజ్జనసమీచీనే=పండితజనమునకు యుక్తమైనదాన

వ్వును, పీత శ్వేత.....పీతే— పీత= పచ్చనిదియును
= తెల్లనిదియును, రక్త=ఎఱ్ఱనిదియును, హరిత = పచ్చనిది
యును, నీల=నల్లనిదియును, కర్బుర=కర్బురవర్ణముకలది
యును విరజ=ధూసరవర్ణముకలదియునుఅయి,విశ్వ=సమ
స్తమును, వ్యాప్త=వ్యాపించినదియును, సునీల=మిగుల
నల్లనిదియునుఅయిన, తోయద=మేఘమునందలి,విద్యుత్
=మెఱుపుయొక్క, లేఖేన=రేఖవలె, భాస్వర=ప్రకాశించు
చున్నదియును,ప్రాణాపానసమానాది= ప్రాణాపానసమాన
ములు మొదలుగాఁగల, పరికరణ=పరికరములుగల,వ్యాస
=వ్యాసమనియెడు, ఉద్యాన=ఆరామమునందలి, పీఠే=
పీఠముకలదానవును, పశ్యల్లలాటే=లలాటమునందు నేత్ర
ముకలదానవును,చిన్మయానంద...... కింజల్కమానే—
చిన్మయానంద=స్వయంప్రకాశమయమును ఆనందమయ
మునుఅయిన,మత్=నాయొక్క, మనోంబుజ=హృత్పుండ
రీకమునందలి,ఉన్నతమణి= శ్రేష్ఠమగుఉన్నతియొక్క, మం
దిర=గృహమునందలి, ఆనందకందళ = ఆనందాంకురముల
చేత, సమాకీర్ణ = వ్యాప్తమై, తప్త=తపింపఁజేయఁబడిన,
సౌవర్ణగర్భ=హిరణ్మయకోశమునందు,చింతామణిమంటప

సహస్ర=చింతామణులచేత నిర్మింపఁబడిన యనేకమంటప
ములయొక్క,స్థూణసహస్ర= ప్రతిమాసహస్రములచేత.
కింజల్కమానే = కింజల్కములవలెనున్న దానవును, జగ
ద్యోతమానే=లోకములను ప్రకాశింపఁజేయుచున్న దాన
వును, భ్రూకుటీ......నాగారే — నిటల=ఫాలభాగము
నందు, కుటిల=వంకరయైన, భ్రూకుటీ = బొమముడులు
కలిగి,శుద్ధ=స్వచ్ఛమైన, స్ఫటిక=స్ఫటికములచేతను, ఘటిత
=కూర్పఁబడినట్టియు. పటుతర=పెద్దదియగు, నవరత్న=
తొమ్మిదివిధములయిన రత్నములుగలిగినట్టియు, శయ్యా=
పడకయందు,సమాసీన=కూర్చుండిన, చతుల=సమర్థమైన,
చిద్బిందుపీఠ = చిత్తనియెడు బిందుప్రముఖ పీఠమునందు,
స్థిత=ఉన్న,శాంభవి=మహాశక్తియొక్క, అనఘామూల
ప్రకృతియొక్క, చరణ=పాదములయందు,సంఘృష్ట=పడి
యున్న, మునికోటి=మునిసమూహములయొక్క, కిరీట=
కిరీటములయందలి, పతక=పతకములయందలి, నవరత్న=
నవరత్నములచేతను, రంగవల్లీ=రంగవల్లులచేతను, సుశో
భన=చక్కగాఁబ్రకాశించుచున్న, ఆగారే=గృహముకల
దానవును, సంతతహృదంబుజవిహారే=ఎడతెగకహృదయ

పద్మమునందు సంచరించుచున్న దానవ్రను, శ్రీ మచ్ఛివ్రు...... విలీనమానే— శ్రీమత్ =సంపత్కరమైన, శివ్రు లెంక మంచిన పండితారాధ్యవంశే — ఈ పేరుగలవంశమనియెడు, అమ్భ తాధి=క్షీరసముద్రమునకు, పూర్ణచంద్ర మాః= రాకా చంద్రుడైన, శ్రీవీరభద్రేశ్వర=సంపత్కరుడగు వీరభద్రేశ్వరుడనువానియొక్క, చరణ=పాదములనియెడు, చిన్న రేజ=ప్రకాశించుచున్న పద్మములయందలి, మాధ్వీక= తేనె యొక్క, పాన=త్రాగుటచేతను. మత్త=మదించిన, మధు పాయమాన = తుమ్మెదవలెనున్న, మానసాంబురుహా= మనఃపద్మమునందలి, అక్షమాలాంగుష్ఠగత=అక్షమాలాం గుష్ఠమును పొందిన, ఇష్టలింగ = అభీష్టలింగముయొక్క, అష్టదళపద్మ=ఎనిమిదిదళములుగలపద్మమునందలి, కర్ణికా =నడుమునందు, విలీనమానే= అడగియున్న దానవ్రను. అపరి మితవిమానే = అంతులేనివిమానముగలదానవ్రను, నిత్య సర్వ......సంయోగసాక్షే— నిత్య= శాశ్వతమైన, సర్వ జ్ఞత్వ=సర్వజ్ఞత్వము, ఆది= మొదలుగాగల, పరిపూర్ణ= సంపూర్ణమైన, షట్కళా =ఆరువిధములయిన విద్యలను, సంధాన=సంధానముచేయునట్టి జననీ=తల్లియొక్క, జఠర

=గర్భమనియెడు కఠోర=కఠినమైన, పీఠ=పీఠమును, అప హారణ=అపహరించునట్లు, విరచిత=నిర్మింపఁబడిన, చంద్ర శేఖర = చంద్రశేఖరుఁడనువానియొక్క, అంతర్గత=మన స్సునుపొందియున్న, స్వానుభవ=ఆత్మానుభవముయొక్క యును, నిత్యానిత్యవివేక = నిత్యానిత్యవస్తువివేచనముయొ క్కయును, సుసంయోగ = చక్కనిదగుసంధానమునకు, సాక్షీ=సాక్షియైనదానవును(అయిన), శ్రీగురుకరుణాకటా క్షే= సంపత్కరుఁడైనగురువుయొక్క కరుణాకటాక్షమా! తే=నీకొఱకు, నమః=నమస్కారము, తే=నీకొఱకు,నమో నమః=పలుమాఱునమస్కారము.

తా॥ సంపత్కరమును అఖండమును సచ్చిదానంద స్వ రూపమును శాశ్వతమును పరిపూర్ణమును అయిన దహరా కాశమునందలి సూక్ష్మరంధ్రములలోపల విహరించుచున్న చిత్తనియెడు గంగానదియొక్క గర్భమునందు పుట్టినప్రకా శకమలముయొక్క దుద్దనియెడు గుహయందు అనఁగా ఆత్మగుహయందుఁబుట్టినదానవును, హంసస్వరూపమగు దానవును, మాయవలనఁబుట్టిన చిద్బిందువనియెడు సింధు నదియొక్క అలలచేతను పుట్టింపఁబడిన సురుగుఁతుంపురుల

యొక్క అగ్రభాగమునందు మిగులసుఖకరమైన సింహాసనమునందుకూర్చున్న పరమహంసయొక్క ముఖమునందలి నిశ్వాసముగల ప్రణవకుండలియొక్క ముఖమండలమందు అలంకరింపఁబడిన హృత్పుండరీకము కలదానవును, సూర్యచంద్ర అగ్నిమండలములు గలదానవును, ఈ ప్రణవకుండలికి పైభాగమునందున్న బ్రహ్మరంధ్రస్థానమునందలి సూర్యచంద్ర అగ్నిమండలములు జ్యోతిర్మండలములయొక్క లోపలనున్న లెక్కలేని గణములయొక్క ఆరోహణములుగల అక్షరములతో వేయిదళములుగల కమలముయొక్క మధ్యనందు అణఁగియున్న దానవును, అనేకములయిన విమానములుగలదానవును, మూలాధారస్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబులను షట్చక్రములయందును సంచరించునట్టి మహిమకలదానవును, మండలత్రియములు కలదానవును, పృథివ్యప్తేజో వాయ్వాకాశస్వరూపురాలవును, బిందువు ధాతువు క్షేత్రము సూత్రము కళలు విద్యలువీనియందునిండిన ఆత్మారామునియొక్క చక్కనిసంబంధము కలదానవును, పంనకు యుక్తమైనదానవును,- పచ్చనిదియును తెల్లనిదియు

ఎఱ్ఱనిదియును ఆకుపచ్చనిదియును నల్లనిదియును కర్బుర
వర్ణముగలదియును ధూసరవర్ణముగలదియును ఆయి యం
తటను వ్యాపించినదియును మిగుల నల్లనిదియును అయిన
మేఘమునందలి మెఱుపుతీఁగవలెఁ బ్రకాశించుచున్నదాన
వును, ప్రాణాపానసమానములు మొదలుగాఁగల పరికర
ములతోఁ గూడుకొనిన వ్యాసమనియెడు ఆరామమునం
దలి పీఠముకలదానవును, ఫాలనేత్రముకలదానవును, స్వ
యంప్రకాశమును ఆనందమయమును అయిన నాహృ
త్పుండరీకమునందలి శ్రేష్ఠమగు ఉన్మనియొక్క గృహము
నందలి ఆనందాంకురములచేత వ్యాప్తమై దీపింపఁజేయఁ
బడిన హిరణ్మయకోశమందలి చింతామణులచేత నిర్మిం
పఁబడిన మంటపసహస్రములచేత కింజల్కములవలెనున్న
దానవును ఎల్లలోకములను ప్రకాశింపఁ జేయుచున్నదాన
వును ఫాలభాగమునందు సుందరమైన బొమముడులు కలిగి
స్వచ్ఛమైన స్ఫటికములచేతను కూర్పఁబడినట్టియు నవరత్న
ములు చెక్కఁబడిన పడకయందు కూర్చుండి బిందుపీఠము
నందున్న మూలప్రకృతియొక్క పాదములయందుపడియు
న్న మునిసమూహములయొక్క కిరీటముళయందలి పతక

ములయందలి నవరత్నములచేతను బాగాప్రకాశించుచున్న గృహముగలదానవును, ఎడతెగక హృదయపద్మమునందు సంచరించుచున్నదానవును, శివులెంకమంచిన పండితారాధ్య వంశమనియెడు క్షీరసముద్రమునకు రాకాచంద్రుడైన వీరభద్రేశ్వరుడను మహాపురుషునియొక్క పాదపద్మములయందలి తేనెను త్రాగుటచేతను మత్తతనుబొందినదై మొదవలెనున్న మనఃపద్మమునందలి యక్షమాలాంగుష్ఠమును బొందిన యిష్టలింగముగల యష్టదళపద్మముయొక్క దుద్దునందు అణగియున్నదానవును, అంతులేని పమానముకలదానవును, నిత్యసర్వజ్ఞత్వము, మొదలుగాంగల షట్కాళ లనుసంధానమునుచేయునట్టితల్లియొక్కగర్భమనియెడు కఠినమగుపీఠమును అపహరించునట్టిచంద్రశేఖరునియొక్క మనస్సునందలి ఆత్మానుభవమునకు నిత్యానిత్యవస్తువివేకమునకు సాక్షియైనదానవును, సంపత్కరుడైన గురువుయొక్క యేకకరుణాకటాక్షమా! నీకొఱకు పలుమాఱులు నమస్కారము. అని తాత్పర్యము.

బ్రహ్మబిలము సమాప్తము.



# నోటీసు.

ఈ పుస్తకములు తెలుఁగు తెలిసిన సమస్తమైన పురుషులకును స్త్రీలకును బాలురకును వృద్ధులకును పండితులకును పామరులకును చక్కఁగాఁ దెలియునట్టులను చదువువారికిని వినువారికిని అత్యంతాహ్లాదము కలుగు నటులను మనోహరమగు మృదుశైలిని వ్రాయఁబడెను. ఇందు వేదాంతవిషయముబాగుగ తెలియఁగలదు. చదివినమాత్రముననే యెట్టిమూఢునికైనను జ్ఞానము కలుగును.

## 1. బ్రహ్మవిద్య. యోగశాస్త్రము.

(ఎనిమిదవకూర్పు) వెల రూ. 2-0-0

ఇది ఉపనిషద్వాక్యార్థముల ననుసరించి అనుభవార్థములతో వ్రాయఁబడినది. ఇందు గురువు లక్షణము, సాధనచతుష్టయ సంపత్తి తాపత్రయములు, ఈషణాత్రయములు, రాగద్వేషాదులు, యజ్ఞోపవీతము, సుఖాసనము, సమాధి, ఏకాంతస్థలము, చక్రవిషయము, వీణాదండము, సుషుమ్న, బ్రహ్మరంధ్రము, కుండలినీశక్తి, పరమహంస, అమనస్కము, మొదలగునవి.

**2.** సు జ్ఞా న బో ధి ని. వెల రూ. 2-8-0

సకల తత్త్వార్థవేత్తయయిన శుకయోగి అగ్నిదే వునకు నుపదేశరూపమునఁ జెప్పిన ధర్మార్థకామమోక్షములనెడు చతుర్విధ పురుషార్థములను దెలుపునట్టి అతి విచిత్రములును నీతియుక్తి చమత్కార హాస్యరసయుక్తములగు ధర్మములు. పెద్దసైజు, 415 పేజీలు. రెండవ కూర్పు.

ఈ పుస్తకములోని విషయములు పూర్తిగాఁ దెలుపుటకు వీలు లేక కొన్నిమాత్రమే యీక్రింద వివరించితిమి:- ఖండదీప ప్రభావము, ఆడుదానికిగలసాహసము; కామముయొక్క మహిమ; భోగముది బ్రాహ్మణునికి నీతులు చెప్పుట; జితేంద్రియత్వము; శ్రీరంగములోని చంద్రపుష్కరణిస్నానమహిమ; పతివ్రతాలక్షణములు; అంకులిలక్షణములు; పాతివ్రత్య ప్రభావము, సుందోపసుందులను రాక్షసులకథ, సాముద్రిక స్త్రీపురుషలక్షణములు, అనసూయప్రభావము, పిండోత్పత్తి, పతివ్రతాశిరోమణియయిన లోపాముద్రమహిమ, చంద్రునికి క్షయరోగము సిద్ధించుట, పరబ్రహ్మ స్వరూపనిర్ణయము,

ఇల్లాండ్ర కేశాక వేశ్యలకుసయితము పాతివ్రత్యమువలన సద్గతికలదనుట, తులసిబృందావనమహిమ, కార్తీకమాస మహాత్మ్యము, పుష్పగిరిమహిమ, వైశాఖమాస మహాత్మ్యము, గయాక్షేత్రమహిమ, గంగాప్రభావము, కాశీక్షేత్రమహిమ, ప్రయాగలో త్రివేణిసంగమస్నానమహిమ, మాఘమాసమాహాత్మ్యము, చిదంబరక్షేత్ర మాహాత్మ్యము, పురుషుల సాముద్రిక లక్షణములు; ఏకాదశీవ్రతము; అందుల ఫలము; ప్రాణాయామము; సమాధిలక్షణము; మహావాక్యములు.

**3.** భగవదుత్తరగీత. వెల రూ 1-4-0

శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి భారత యుద్ధానంతర మందు అర్జునునకు తటస్థస్వరూపలక్షణములచేత పరబ్రహ్మతత్వమును బోధించెను. ఇదియే భగవదుత్తరగీత. ఇది నాలుగధ్యాయముల గ్రంథము. ఇందు అంగన్యాస కరన్యాసములు ధ్యానము టీకి తాత్పర్యములు అంతరార్థములువిశేషార్థములు అనుభవార్థములు వ్రాయంబడెను. ఇందుబ్రహ్మనిష్ఠ, మనోలయము, ఇడాపింగళసుషుమ్నలు, అర్చిరాది ధూమాది మార్గములు, ఖేచరీముద్ర, పంచ

కోశములు, షట్చక్రములు, యమాద్యష్టాంగంబులు, లక్ష్యానుసంధానము, బ్రహ్మవేత్తలు, హంసవిషయము, యోగవిషయము, ప్రణవము, ప్రాణాయామము, చిదాకాశము, ధ్యానయోగము, ఆత్మమంత్రము, హృదయకమలము, మొదలుగాఁగల అనేకవిషయములు తేటతెల్లముగ తెలుపఁబడెను. పెద్దసైజు, 124 పేజీలు, 4 అధ్యాయములు. 205 శ్లోకములు, (రెండవకూర్పు)

4. జ్ఞానాంజనము. వెల 4 అణాలు.

5. వేదాంతసారము వెల 4 అణాలు.

6. బ్రహ్మబిలము వెల 4 అణాలు.

ఇందు వేదాంతము, యోగము, బ్రహ్మరంధ్రము, భుజగశక్తి, షట్చక్రములు, సహస్రారము, ప్రణవము, బ్రహ్మబిలము, పరమహంస, బ్రహ్మవేత్తలు; హృత్పద్మము, పావకస్థానము, ద్వాదశస్థానము యోగవిషయము, సాంఖ్యతారక అమనస్కంబులు, భావములు, అనుభవములు. పరబ్రహ్మతత్వము మొదలగునవి తెలుపఁబడెను.

గొల్లపూడి దుర్గాప్రసాదరావు గారికి,

గుంటూరు

# AN APPEAL TO THE PUBLIC.

The public are cordially invited to draw their attention to the following books on Yoga Philosophy, Vedantism, and Ethics, whose principles are therein treated by means of beautiful and graphic narratives (in Telugu) so simple as they are within the reach of even females for whom they are specially written. It is indispensable to every Hindu family to have a copy of each of these books. As our books are printed in fine and glazed paper, in good type, and in good style, we trust our books will find among the Telugu-reading gentry, the encouragement they so richly deserve. Look sharp! Apply soon !!

It should be the look-out of every gentleman to provide himself with a copy of our valuable works.

| | | | Rs. | A. | P. |
|---|---|---|---|---|---|
| 1. | Brahmavidya | 8th Edition | 2 | 0 | 0 |
| 2. | Suguanabodhini | 2nd ,, | 2 | 8 | 0 |
| 3. | Bhagavathutharagita | 2nd ,, | 1 | 4 | 0 |
| 4. | Gyananjanam | ,, | 0 | 4 | 0 |
| 5. | Vedantasaram | | 0 | 4 | 0 |
| 6. | Brahmabilam | 2nd Edition | 0 | 4 | 0 |

*N.B*:—Postage Extra.

